# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 13 | రాజమహేంద్రవరము 16-6-1990, 1-7-1990 | సంచికలు 16, 17

—• ఈ సంచికలో •—



రాబోవు సంచికలో:- 1. కర్పూర వసంతరాయలు కావ్యంలో ఛందోవైవిధ్యం
2. ఆదిశంకరుల భజగోవింద స్తోత్రానికి తెనుగుసేత "హరిగోవిందా!"
3. శ్రీశ్రీకి తిలక్‌కు భేదసాదృశ్యాలు
4. విశ్వనాథ మధ్యాక్కరలు - సమీక్ష
5. పూసపాటివారి నాశ్రయించిన తొలికవి - వేములవాడ భీమకవి మొదలగు రచనలు ఉంటాయి.

రాబోవు సంచిక :

## వ్యవస్థాపకులు కీ॥శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారి సంస్మరణ సంచిక

1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 12-00 | విడి ప్రతి 0-60 పై.

6 మాసములకు రు. 6-50

**సాహిత్యపరమైన రచనలకు సమాలోచన స్వాగతం!**

# సంపాదకుని మాట

సాహిత్యలోకంలో ధృవతారల్లాంటి కవయిత్రులెందరో ఉన్నారు. స్త్రీ సృష్టికి కారణభూతురాలు. సాహిత్య సృష్టిలోకూడా స్త్రీ వెనుకంజ వేయలేదు. నేటి రచయితలు మన పూర్వ రచయిత్రులను, కవయిత్రులను మరచిపోయినట్లు కనుపించుచున్నది. నేటి సమాజానికి వారి కవితాప్రాభవాన్ని మళ్లీ జ్ఞాపకం చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఉన్నతవిద్య నభ్యసించి ఉన్నతమైన, ఉదాత్తమైన రచనలు చేసే రచయిత్రులైనా ఇందుకు పూనుకోవడం భావ్యం. కాలంతో మారిన కవిత్వ పంథా నపహసించడం లేదు. తృణీకరించడమూ లేదు. కాని ఆ వికాసంతోపాటు ఎందరో మహానుభావులు — మహాకవులను మనం స్మరించడం మన సాహిత్య జీవనానికి మంచిది. సహృదయులైన రచయితలు ఇందుకు ముందుకు రావాలి. మన ప్రాచీన కవితాప్రాభవాలను ఒక పద్ధతిలో ప్రాచీన కవితాసారభాల్ని మనకు అందించడానికి విజ్ఞులైనవారెవరైనా పూనుకుంటే చాలా సంతోషం.

సంపాదకుడు

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**


## 1. హరవిలాసము - వీరశైవాచారములు

—శ్రీ రాళ్ళపల్లి సుబ్బారావు, ఎం. ఏ.,

14-15 శతాబ్దుల నడిమి కాలమందు తెలుగుసాహితీ సామ్రాజ్యాధినేత, సమకాలీన కవి పండితులను వాద ప్రతివాదములచే నవనత శిరస్కులను గావించి 'కవిసార్వభౌమ' పురస్కృతుడైన శ్రీనాథుడు తన కావ్య నిర్మాణ కౌశలముచే నిర్మింపబడిన హరవిలాసము వీరశైవుల కాగమ గ్రంథమై భాసిల్లినది. ఈ కావ్యము వీరశైవాచారముల కద్దము పట్టినది.

హరవిలాసము ఏడాశ్వాసముల ప్రబంధము. శ్రీనాథుడు తెనుగు పద భూయిష్ఠము గను, దీర్ఘ సంస్కృత సమాస విరహితము గను ఏ కావ్యమును నిర్మించెను. ఆనాటి వణిగ్వంశశ్రేష్ఠి యగు అవచి తిప్పయ్యసెట్టికి కావ్యమంకిత మిచ్చెను. వీరశైవుల భక్తి ప్రపత్తులు, ఆచార నియమములు, శివప్రస్తుతులు, ఆరాధనా విధానము లిందు బహుధా వర్ణితము. ఇందలి సిరియాళుని కథ యిట్టి వర్ణనములచే నలంకృత మైనది. అట్టి యాచార వ్యవహారముల విహంగ వీక్షణ మీ వ్యాసము.

వీరశైవులకు షట్కాల లింగార్చన మత్యావశ్యము. కాంచీనగర వాసి, భక్తప్రపత్తుల జీవన్మూర్తియైన చిఱుతొండనంబి, వాని భార్య తిరువెంగనాంచి ప్రతినిత్యము సూర్యోదయాత్పూర్వ సవనములందు, మధ్యాహ్నమందు శివలింగార్చన మొనర్చెడివారు. వారిరువు రేకాలము నందును జంగమారాధనల నేమముకుందురు. 'వాని సరి యెవ్వడు లేఁడు వసుంధరా స్థలిన్' అని పరమేశ ప్రస్తుతికిఁ బాత్రుడయ్యె.

అతిథి, యభ్యాగతులకు పాదార్చనాద్యుపచారములు చేయుట శైవాచారములలో ద్వితీయము. చిఱుతొండనంబి గృహాంగణమునకు నెల్లనికావి పచ్చడముధరించి, నున్నని తలపై పచ్చిగంధము నిడుకొని, కరసంపుటములో శివలింగము నిడుకొని యొక జంగముఁ డరుదెంచెను గృహాంగణా ప్రవేశ మొనర్చినంతనే చిఱుతొండనంబి దంపతులు వానికిఁ బాదప్రక్షాళనము గావించి, యా పాదోదకమును పానముచేసి శిరమునఁ జల్లుకొని, పుణ్యకార్య నిర్వహణ సంతుష్టులయ్యెడివారు,

'శ్రీ పాదంబులు గడిగెను
శ్రీపాదోదకముఁ గొనియెఁ జెలువయుఁ
దానున్.'

శైవాచారములలో విచిత్రము,విశిష్టమైనది విభూది యందు కొనుట. పాదార్చనాద్యుపచారములు గైకొని సంతుష్టుడైన మిండజంగముడు శివునభక్తునిఁ జేయుటకుఁ దూమెడిశ రవంబు తెమ్మని కోరెను. నంబి యందుల కంగీకారము తెల్పుచూ, జంగము చౌపగిన విభూదియందు కొనెను.

చే గాను గాడి చెఱకుం
దీగ రసంబునఁ బురారిఁ దెల్పక కుడువన్
... ... ....
... .... బిన్న నభ్యర్థింతున్.

అని కథంబున ధరియించిన యాలాబుం గాయలోని భస్మం బిచ్చిన నల్లె యని యందుకొని' అను వాక్యములు స్పష్టమొనర్చును. ఇట్లు విభూదినందుకొనుట కైవల్య దాయకమని వీరిభావన.

పరమేశ్వరు నవరావతారముగా జంగములను తలంచి వీరశైవులు వారి కార్య నిర్వహణకుఁ దమ ప్రాణములైనను లక్ష్యపెట్టరు. ఇది వీరి మరొక నియమము.

శివయోగి యొనర్చు శివాభిషేకమునకు నూరుపుండ్రదేశములను మోపుకట్టి పైకెత్తు

కొనబోయి, విఫలయత్నుడై నేలకొరిగెను. శరీరమంతయుఁ జెమర్చెను. మరొక సన్నివేశమున శైవమహావ్రతమున నరమాంసము పాకము నొనరించి నివేదనము గావింపవలెనని కోరినకపట శివయోగి కఠోరనియమ మంగీకరించి చిఱుతొండనంబి తదను గుణముగాఁ దన యేకైకపుత్రునే జంపి యాహారముగా నివేదనకు పెట్టెను. 'మన శరీరార్ధ ప్రాణంబులకుం గర్తలు శివయోగీశ్వరులే కాక మఱి యెవ్వరు? వారి సొమ్ములు వారికే సమర్పించుటయును నొక దొడ్డ పనియే (2-88)' యను వాక్యములం బట్టి శైవులు తమ ధనప్రాణములనైనను శివయోగుల కర్పింప సంకింపరు.

కాంచీనగరంబున నేకధారగా మూడేడు నాళ్ళు దేవేంద్రునానతిచే మేఘుడు వర్షించెను. చిఱుతొండడు శివయోగిజన సందోహ సంరక్షణార్థమై వివిధ భోజన పదార్ధములను వండించి వడ్డించెడివాడు. వంటచెఱకు నిండుకొనగా నింటిదూలములను పీకించి, వంటచెఱకుగవాడెను. అవియు నిండుకొని, తమ కట్టు వట్టువస్త్రములనైనను నూనెయందు ముంచివంటవండుటకై నుపయోగించి శివయోగులను పోషించెను. యోగిజన పరిపోషణకు తమ సమస్తములును త్యాజ్యములే యని వారి ప్రగాఢ విశ్వాసము.

శివయోగు లేపదార్థము లడిగినను కాదు లేదన కొసగుట వీరశైవులాచారము. వృద్ధ జంగముడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో నొక్క నరుడు, ప్రియవాది, కడు చిన్న వయసువాడు, రోగశంకావిహీనుండు, రూపసి యగువానిఁ దల్లిదండ్రులే పాక మొనరించి వడ్డించిన శివునకు నివేదింతునని కోరగా సంతోషమున నాదంపతు లంగీకరించి తమ జన్మలు సఫలీకృతమైనట్లు భావించిరేగాని నావంత చింత నొందలేదు.

శైవులకు జంగమారాధనము మిగులావశ్యకము. వీరశైవాచార సాంప్రదాయానుసారము శైవులు దేహము నిండ విభూది యలదుకొని, మడుగు ధోవతులఁ ధరించి, హస్తమందు శివలింగమిడుకొని, భక్తితత్పరతఁ నభిషేకమొనర్చి, తదియొత్తి, చందనము, పూలమాలలు, ధూపదీపములు, తాంబూలాదుల నొసంగి వందనము లాచరింతురు. అనంతరము జంగమారాధనము గావించి నైవేద్యమిడెడి వ్రతమొనరించెడివారు. వీరశైవులు శివునకు శివయోగుల కభేదము పాటించెడివారు. వేశ్యావాటికలందు సంచరించువారైనను జంగమ ప్రమథులం గొలిచెడివారు. శివునకు. శివయోగులకు నివేదన మొనర్చినగాని నాహారముముట్టరు. శివయోగుల కాహారమర్పింపకున్న దినమంతయు వారు నుపవాసము పాటింతురు. శివయోగులను శివుని మాఱురూపముగా భావించి కొలచుట, శైవుల భక్తికి నిదర్శనము.

పార్వతి యెఱుకతవేషధారి.నంబిభార్య యగు తిరువెంగనాంచితో

కం. జోగులు కపటో పా య
ప్రాగల్భ్యంబున నిధాన పనసిద్ధులకై
యే గతుల నైనఁ దిరుగుదు
రోగి రమణగ సుతునిఁ జంపు టుచితమె
మీకున్. 2-99"

తే. ఆవగిం జంత ధూతి మై నలది కొనిన
వెలది! గుమ్మడి కాయంత
పెట్టిపెట్టుఁ.... (2-100)

మగవాడు మ్రానువంటివాడు. నిసువుఁ జంపంగ తగునా?' యని పల్కగా తిరువెంగనాంచి "శివుడన శివయోగి యన భేదంబు గలదే? శివుండు కర్త. శివుండు భోక్త" యనుట యామె భక్తివైశిష్ట్యము పరాకాష్ఠ నొందినది. పార్వతికాసమాధానమునకుదిక్కు తోచలేదు.

శైవులు, వీరశైవులు శివభక్తిప్రతిపాదకములైన వీరశైవగ్రంథములయిన నీలకంఠస్తవము, శివాష్టక మిత్యాదులు పఠించెడివారు. సిరియాళుని భక్తిఁ బరీక్షింప శివుడు జంగమవేషమున గురుకులమున ప్రవేశించెను. అట్టి తఱి సిరియాళుడు తోటిబాలకులలో, గ్రహంబులలో సురరాజువలె జంగమునకు తోచెను. సాష్టాంగప్రణుడైన సిరియాళునితో మధుపాన మత్తుడగు గురువుల జోరులకు నీ దండ్రిదానవుడై నిను జంపి నాహారముగా బెట్టనిశ్చయించె. "జీవన్ భద్రాణి పశ్యతి' యని వేదంబులు నుడువుచున్నవి గావున నెక్కడికేని పాఱిపొమ్ము" యనగా పరార్థమైతనూ, ధనము వ్యయింపఁ గల్గుట కదా జననైక ఫలంబు 'పరోపకారార్థ మిదం శరీరమ్' 'కీర్తికాయంబు గైకొంట కార్తియేల" యనెడి దాతృత్వ తత్వబోధచేయగా జంగముడు "వాడు చిఱుతొండనంబి కంటె నధికుండు" అని తలపించెను. ఇందు సిరియాళుని భక్తి యొక్కటియేగాక వితరణ శీలిగా నభివ్యక్తీకరించెను. తానునేర్చిన పాఠసారాంశమింతటిదని దెలియనగును.

ఐహిక సుఖములను త్యజించి 'జననైకఫలంబు కైవల్యంబు' అనుసూక్తిని మనన చేయుచు, ధనమానప్రాణంబులను శివయోగుల కర్పించు భక్తి తత్పరత, శైవాచారములు సమధిక జనసమాదరణీయములే కదా!

వేమారెడ్డి కాప్తమిత్రుడైన అవచి తిప్పయసెట్టి కావ్యభర్తయగుట మూలకారణము మహోదాత యగు తిప్పయ్యకు చిఱుతొండనంబి మూలపురుషుడు తిప్పయ్యచిరయశస్కుడు. శ్రీనాథుడు ధన్యజీవి. శ్రీనాథుని రచనా సంవిధానము గంగాప్రవాహమై పఠితలను పునీతులఁ జేయును.

(*,*)

# 2. శివానందలహరి - కొన్ని అనువాదాలు

—శ్రీ కపిలవాయి లింగమూర్తి

సాంఖ్యుల ప్రకృతి పరబ్రహ్మలు పౌరాణికులకు ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరులైనారు. ప్రకృతిలో సౌందర్యం పురుషునిలో ఆనందం ఉన్నవి. సౌందర్యం బాహ్యమైన చక్షువులతో అనుభవింపబడితే ఆనందం మనస్సులో భావించి పొందబడుతుంది. అందుచేత లోకంలో ప్రకృతి ఉపాసకులు చక్షుః ప్రీణనులై సౌందర్యా రాధకులైతే పరబ్రహ్మారాధకులు నిరంతరం భావనా వ్యాపారంలో మునిగి ఆనందంలో తేలిపోతుంటారు.

ఆచార్య శంకరుడు ఈ సగుణనిర్గుణ తత్త్వాలు బాగాఅవగాహనచేసికున్నాడు కనుక ఆయన తన విద్యా తపోయోగ బలాలచేత వాని రూప సౌందర్యాలను దర్శించి తన హృదయంలో తరంగితమైన ఆనందాన్ని సౌందర్యలహరి శివానందలహరి అనే రెండుకృతులుగా ఆస్తిక లోకానికి అందించినాడు.

తత్త్వదృష్టితో నేకాక కవితాదృష్టితో గూడ ఆరెండు కృతులు పరాంకోటి కెక్కినవి కనుక అటు తత్త్వలుబ్ధులు ఇటు రసలుబ్ధులు ఎందరో వానికి తమశక్తి కొలది అనువాదాలు వ్యాఖ్యలు వెలయించినారు. వెలయిస్తున్నారు.

శ్రీ గట్టం సుబ్రహ్మణంగారు, కార్యంపూడి రాజమన్నారుగారు, జంధ్యాల వెంకటేశ్వరశాస్త్రిగారు అట్టివారిలో కొందరు. వీరు శివానందలహరిని ఆంధ్రీకరించినారు. వీరిలో శ్రీ వెంకటేశ్వర శాస్త్రిగారు నాకు పరిచితులు. వారు పండితవంశంలో పుట్టినారు. కవిమూర్ధన్యులైన కరుణశ్రీగారి పితృవ్య పుత్రులు. సత్యసాయికి అనన్య భక్తులై ప్రస్తుతం ప్రశాంతి నిలయంలో నివసిస్తూ శివానందలహరిని సాయీ ఆనందలహరిగా చేసినారు.

సుందరమందారం, తియ్యని పాటల తిరుప్పావై వారివి దీనికంటె ముందురచనలు. సుందరమందారం రామాయణంలోని సుందరకాండకు గేయానువాదం. తిరుప్పావై గోదాదేవి పాశురాలకు తెలుగు రూపం.

సుందర మందారం, తియ్యని పాటల తిరుప్పావై అనే పేర్లు చూడగానే అందులో కవిగారి ఉద్దేశ్యం ఆరచనల వైశిష్ట్యం పాఠకునికి స్పష్టంగా తెలిసిపోతుంది. కాని ఈ శివానందలహరి మాత్రం అలా కాలేదు. పేరు యథామూలంగానే ఉన్న అనువాదం మాత్రం సవిశేషంగా ఉంది.

అనువాదం అన్నపుడు యథామూలానువాదమే అనువాదం. అంటే శాబ్దికమైన భాషాంతరీకరణమే నిజమైన అనువాదం కాని ఒక్కొక్కపుడు శబ్దాన్నే ప్రధానంగా చేసికొంటే మూలంలోని సొగసు అనూదితంలో రాకపోవచ్చు.

మనభాషలలో ఒక్కొక్క దానికి ఒకరకమైన జాతీయాలు, ఒకరకమైన భాషీయాలు ఒకరకమైన పదబంధాలు ఉన్నవి కాబట్టి దేనిసొగసుదానిది. అందుచేత మూలభాషలోని సొగసు అనువాద భాషలో తేవలసినపుడు మూలంలోని జాతీయమో భాషీయమోకన భాషలో లేకుంటె దానికి సమానమైన మరోదాన్ని అనుసక్తి వాడవలసి ఉంటుంది. అలాగే కొన్ని స్థలాలో మూలాన్ని చెప్పే వాక్య విన్యాసం మారవచ్చు. కాబట్టి అటువంటి రచనను అనువాదం అనటం కంటె అనునాదం అనటం తెప్పు.

ఈ రెండుపద్ధతులేకాక అనువాదంలో మూలాన్ని వదించడం, పెంచటంకూడా ఉన్నది. దానికి మనకు ఆంధ్రమహాభారత భాగవతాలు ఉదాహరణాలు.

భర్తృహరి సుభాషిత త్రిశతిని ఏనుగు లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి, ఎల్లూరి నరసింగకవి అనే ముగ్గురు కవులు అనువదించినారు వారిలో మొదటివాడైన ఏనుగు లక్ష్మణకవి, అనువాదంలో ఆయా వస్తువుకు తగిన వృత్తాన్ని ఎన్నుకొని చంపూ పద్ధతిలో అనువదిస్తు ఉంటూ పోగా ఎలకూచి బాలసరస్వతి శతకనియమాన్ని పెట్టుకొని శార్దూల మత్తేభాలు స్వీకరించినాడు దానితో అతడు అల్ప వృత్తాలను సాగదీసికోవలసివస్తే ఎల్లూరి నరసింగకవి కందాలలో అనువదించినాడు కాబట్టి మూలంలోని విషయ విస్తారంగల వృత్తాలను వదించుకోవలసివచ్చింది. ఈ రెండు విధాలుగూడా ఒక్కొక్కపుడు అనువాదానికి తగినంత ప్రశస్తితే లేవు. అందుచేత మూలవిధేయంగాసాగిన ఏనుగు లక్ష్మణకవి రచనకు ప్రశస్తి దక్కింది.

ఇపుడు శివానందలహరికిగూడ ఇదే విధంగా అనువాదాలు అభ్యమౌతున్నవి. మొదటివారైన గట్టం వెంకట సుబ్రహ్మణ్యంగారు ఏకవృత్తనియమం పెట్టుకోకుండా ఎక్కడికక్కడ మూలానికి తగిన పద్యాన్ని స్వీకరించినారు కాబట్టి వారి రచన ఏనుగు లక్ష్మణకవిగారి అనువాదం వలె మూల విధేయంగా సాగింది. వీరి పద్యాలు ధారాశుద్ధి శోభితమై అలరారుతున్నవి కాని అవిశిష్టము బాహుళ్యంగా ఉన్నవి.

రెండవవారైన కార్యంపూడి రాజమన్నారుగారుకూడ ఏకవృత్తనియమం

పెట్టుకోలేదు, వీరైనంతవరకు తెలుగుతనాన్ని తెచ్చినారు. కాని వీరి పద్యాలలో కొన్ని కంచపాదులు కొన్ని వట్పాదులు కాక తప్పలేదు. విషయం అనువాదంగాని, సొంతంగాని పద్యం అన్నప్పుడు దాన్ని నాలుగు పాదాలలోనికి పొదించి ఉపసంహరించటంలోనే కవి యొక్క సామర్థ్యం మెలకువ ఇమిడి ఉన్నది.

శివానందలహరి వందశ్లోకాల కృతి. అయితే వంద అన్నప్పుడు తెలుగులో దానిపై శతకచ్ఛాయ పడుతుంది. అందుచేత మూడవవారైన జంధ్యాల వెంకటేశ్వరశాస్త్రిగారు తమ అనువాదానికి శతకాన్ని దృష్టిలో ఉంచుకొని సీసాలను స్వీకరించినారు.

సీసం తెలుగులో అన్నిటికంటె పెద్ద పద్యం కాబట్టి తగినంత విషయం లేకుంటె అవి బక్కచిక్కిన గొడ్లలాగుంటవి. అయితే శాస్త్రిగారు మాత్రం తమసీసాలకావిధంగాకాకుండా వాటిని తమ పాండిత్యంతో పరిపుష్టంచేసినారు. ఉదాహరణంగా కొన్ని చూడండి.

ఘటోవామృత్పిండోఽప్యణురపిచ
ధూమోగ్నిరచలః
పటోవా తంతుర్వా పరిహరతికిం ఘోర
శమనం-

అని దీనిలో కుమ్మరి శర్గాలను కుండను పుట్టి, పొగను నిప్పు - బట్టను నూలు అనే మూడు వస్తువులు మాత్రమే ఆధారంగా చెప్పబడినవి. నాలుగోపాదంలో వానిని సమన్వయం చేయటానికి వీలుంది కాని సీసం అలాగాదు. నాలుగు పాదాలలో నాలుగు విషయాలు చెప్పి గీతంలో వాని సమన్వయం చెబుతారు. అందుచేత శాస్త్రిగారు దీనిలో నాలుగవదిగా చిత్రానికి భిత్తిని స్వీకరించినారు.

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం
జడమతిః

అని పూలకోరకు కాసారాలలో దిగటం అడవులలో తిరగటం మాత్రమే ఇందులో చెప్పబడినవి. అటుపూజకుగాని యిటు పద్యానికిగాని ఈ రెండేచాలవు. అందుచేత కవిగారు వీని జతకు పత్రి-పాలు చేర్చిపూజా సామగ్రిని పూర్తి చేసినారు.

వటుర్వా గేహీ వాయతిరపిజటీవా
తదితరో
నరోవాయః కశ్చిద్భవతు భవకింతేన
భవతి-

అనే దానిలో వటువు, గేహీ, యతి, జటి అని పేర్లు నాలుగు ఉన్నా ఆశ్రమాలు మాత్రం మూడే చెప్పబడినవి. అందుచేత యిందులో యతిస్థానంలో వానప్రస్థాన్ని చేర్చి చతురాశ్రమాలను సమగ్రంగా చూపినారు.

అపారే సంసారే నిజభజన దూరే జడధియా
భ్రమంతం మామాంధం-

అనే దానిలో "నిజభజన" అనే దళాన్ని గ్రహించి, పద్యంలో స్మరణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనం అనే నవవిధ భక్తులలో ఒక్కొక్క దళాన్ని పూరించినారు. ఈవిధంగా శాస్త్రిగారు ఈ అనువాదంలో వెలితికనిపించకుండా ఏదో ఒకవిధంగా అర్థపరిపుష్టిని, భావపరిపుష్టిని, రసపరిపుష్టిని సాధించినారు.

గద్వాల చిన్నసోమ భూపాలుడు జయపాలుడు జయదేవుని గీతా గోవిందాన్ని అనుకరిస్తూ అందులో ఒక్కొక్క శ్లోకానికి ఒక పద్యం, ఒకదరువు, ఒక చూర్ణిక వ్రాసివిస్తరించినారు. అదే విధంగా శాస్త్రిగారుకూడ ఈ అనువాదంలో ప్రతి శ్లోకానికి ఒకపద్యం, దాన్ని వివరిస్తూ ఒకవ్యాఖ్యానం, దానిక్రింద అందుకు తగిన ఒకసూక్తిని ఘటించి మూలభావాన్ని త్రికరణశుద్ధిగా విశదీకరించినారు. ఇది ఈ రచనలోని విశేషం.

శ్రీ గుజ్జం సుబ్రహ్మణ్యంగారు కూడ పద్యానువాదంతో పాటు మూలానికి తాత్పర్యం కూడా యిచ్చినారు. అది పద్యాలవెంటగాక చివరన స్వతంత్రంగా ఉంది.

ముద్రణలోగూడ వీరు సరిపుటలలో మూలం బేసిలో అనువాదం అనగా పాఠకునికి ఎడమవైపున మూలం కుడివైపున అనువాదం అందించినారు కాని రాజమన్నారుగారు అలాకాక మొదట అనువాదం దానిక్రింద మూలం యిచ్చినారు. అనువాదాలలో అగ్రస్థానం ఎప్పుడైనా మూలానిదేకాని వీరుదాన్ని త్రోసిరాజని అనువాదానికీయటం విశేషం. అంతేకాక వీరుకూడ పుస్తకం చివరనలఘుటీక యిచ్చినారు.

శాస్త్రిగారి కృతి పుట్టపర్తిలో వెలసిన శ్రీ సత్యసాయి బాబాగారికి అంకితం. షిర్డీబాబాగారి అనంతరం దేశంలో ఎందరో ఆబాబాగారిపేర వెలసినారు. అందుచేత వారిలో బాబాగారు నిజమైన సాయిగాబట్టి సత్యసాయి అయినాడు. సాయి పదం హిందీ భాషలో స్వామి శబ్దానికి రూపాంతరం. చంద్రబిందుయుగళ అది చంద్రకలాభూషణుడైన పరమేశ్వర వాచకంగా హిందీలోని భక్తకవులందరితో వాడబడింది. ఈ పదాన్నిపుడు తాత్వికులు స + అయి అని విడదీసి సాయిని సాంబునిగా దర్శిస్తున్నారు. అందుచేత పండితులైన శ్రీ శాస్త్రిగారు సాయిలో పరమేశ్వరునిలోసాయినిదర్శించిన ప్రజ్ఞాచక్షువులు కనుక తమ కృతిని సాయిపాదాలకు ఒకశ్రీదళంగా అర్పించి ధన్యులైనారు.

తమరచనలో వీరు శతక నియమాన్ని దృష్టిలో ఉంచుకొని ఏకసంఖ్యానియమాన్ని ఎలాగూ పాటించినారు కాబట్టి ఏకమకుట నియమం గూడ పాటించి ఉంటే ఈపద్యాలు మరింత సొగసుగా ఉండేవి.

—0—

# 3. కనకాభిషేకము (నాటిక)

—శ్రీ క్రొవ్విడి రామం, బి ఏ., బి.యల్, బి యిడి.,

పాత్రలు :-

1. పూసపాటి విజయరామమహారాజు:- - విజయనగర సంస్థానాధీశ్వరులు:
2. వెంకన్నబుగత - అత్మ్మణచయినులు - అగ్రహారీకులు
3. భాస్కరశాస్త్రి:- పెద్దాపురం - సంస్థానోద్యోగి
4. సీతారామరాజు:- విజయనగర సంస్థా - నాధీశుల దివాన్
5. కేశపల్లి సోమప్పకవి:- కూరకవి సమకాలికుడు కూరకవి ప్రత్యర్థి.
6. రామకూరి:- పెద్దాపురాస్థానకవి.
7. తిమ్మభూపతి:- పెద్దాపురం జమీందారుగారు.
8. వెంకటావధాని:- వేదపండితుడు

(అగ్రహారీకులు, వెంకటావధాని, రామకూరి కల్పితపాత్రలు, మిగిలినవి చరిత్ర ప్రసిద్ధములు)

వెంకన్నబుగత:-ఊరేయ్యది ?

కూరకవి.-చీపురుపల్లి-

అత్మ్మణ చయినులు:-పేరో ?

కూరకవి:- కూరకవి - ఇంటిపేరడిదము వారీమారాజా విజయరామమహారాజా

వెంకన్నబుగత:-అతదేమి సరసుడా ?

కూరకవి:- భోజుడయా ?

అత్మ్మణ చయినులు:- సంభావణ పద్యంవరసతో నడిచినట్టుం దేమిటి బాబూ ?

కూరకవి:- "ఊరేయ్యది" అని మీరు సులక్షణంగా ప్రశ్నిస్తే నేను కూడా పద్యంలోనే జవాబు చెప్పేను సంభావణ కందపద్యంతో నడిచింది.

వెంకన్నబుగత:- నేడు సుదినం, కవీశ్వరుల దర్శనం అయింది.

అత్మ్మణచయినులు:- అగ్రహారంబుగతలం - వేదం ముక్కలుకల్లె నేసుకోవడం నాలుగు గింజలు పండించుకోవడం మాకని, కవిత్వం మాకేం తెలుస్తుంది బాబూ ? పదండి - మేము అతోవనే వస్తున్నాం - ఇంతకీ చీపురుపల్లిలో తమ బస ఎక్కడ ?

కూరకవి:- రామచంద్ర పురాగ్రహారంలో ఈశ్వరాలయం పక్కని వున్నదే మా బస.

అత్మ్మణచయినులు:- మీరు ఆగ్రహించకుండావుంటే చిన్నమనవి చేసుకుంటాను.

కూరకవి:- సెలవియ్యండి.

అత్మ్మణచయినులు:- పండిననాడు- ఎండిననాడు - ఆభూదేవతనే నమ్ముకుని సేద్యం చేసుకుంటున్నాం - నేటికిమూడు సంవత్సరాలైంది - భూమిమీద టక్కున చినుకులేదు. ఈమదేవత వికటాట్టహాసం చేస్తోంది. ఈ సంగతి తెలిసికూడా బకాయి శిస్తుకోసం దివాన్‌గారు ఫర్మానాల మీద ఫర్మానాలు పంపిస్తునే వున్నారు. మాగోడువారికి చెవిటివాడి ముందు శంఖు అయింది. ఏం చెప్పుకోం - ఎవరితో చెప్పుకోం - దారుణంగావుంది వారి అజమాయిషీ, తమరేమైనా మా గోడు వారితో ...

కూరకవి:- సీతారామరాజుగారి సంగతి అందరికీ తెలిసిందే ! ప్రభువుమంచివాడైనా నడిపించే సారధి దుర్నయుడైతే, ప్రజలపాట్లు యింతే - అయితే యివి ఎల్లకాలం వుండిపోవు - కాలం మారకతప్పదు - ఎవరైనా ప్రజావా[..]ళ్ళ ఒగ్గక తప్పదు - ఏనాడో నేను

"అధికారమత్తత అత్యుచ్ఛ్రితుండైన
నది శీఘ్రముననె పెంపణగిపోవు
పాపకర్ముండు గావించు బాధకదలి
యవధిలేదని కృశియింతు రవనిజనులు
తెలియదడవె సుయోధనాదుల చరితలు
రామలింగేశ రామచంద్రపురవాస."

అని రామలింగేశ్వరునితో మొట్ట పెట్టుకున్నాను విధి విలాసాన్ని ఎవ్వరూమార్చలేరు. పరిస్థితులు మాత్రం యెల్లకాలం యిలా వుండవు. వీధి చివరను ఎవరో నాకోసం వేచి ఉన్నట్టుంది. నేను ముందునడుస్తాను.

* * * *

కూరకవి.- ఇదివరకు నాకు తమ దర్శనం కాలేదు. నా వల్ల తమకేదైనా ....

భాస్కరశాస్త్రి:- నన్ను తమకు తెలి తెలియకపోయినా మహాకవీశ్వరులైన తమను నాకు బాగా తెలుసును. ఒకప్పుడు మేము యీ ప్రాంతం వాళ్లమే, మా తాతలు పెద్దాపురం తరలివెళ్ళేరు. అప్పటి నుంచీ ఆ జమీందారుల కొలువులోనే సేవచేస్తున్నాం. నన్ను భాస్కరశాస్త్రి అంటారు.

కూరకవి:- తమరు దయచేసిన కార్యం ఏమిటో సెలవిచ్చేరుకారు.

భాస్కరశాస్త్రి:- కార్తీక శుద్ధఏకాదశి నాడు మా ప్రభువుల జన్మదినం. మీరు కవిజనరంజనమనే కావ్యాన్ని వ్రాసినట్లు తెలిసింది - మా ఏలిక మీ గళమాధుర్యంతో మిళితమైన మీ కవనాన్ని విని, ఆనాడు మీకు కనకాభిషేకం చెయ్యాలని సంకల్పించేరు. వత్సవాయి తిమ్మగజపతి నృపాలశేఖరులు తమకు అందజేయమన్న శ్రీముఖాన్ని చిత్తగించండి.

కూరకవి:- నా ఆరాధ్య దైవమైన రామలింగేశ్వరుడే యీ సత్కారాని[కి]

అర్భకుడం. నేను ఏ పాటివాణ్ణి - పరిమిత జ్ఞుణ్ని.

భాస్కరశాస్త్రి:- గోక్షీరం యొక్క మాధుర్యాన్ని గోమాత ఎరగదు. దానిని ఆస్వాదించి, ఆనందించిన ఆ బాలగోపాలము గోక్షీరాన్ని ప్రశంసిస్తారు. ఆ విధంగానే తమ కవితాసుధా ధారలో ప్రాశస్త్యంతమున అచుంబిత మేమోగాని అస్మదాదులకు అది ప్రశంసనీయం -

సూరకవి:- సరే - ఇంతకీ ప్రభువుల ఆజ్ఞ అనుల్లంఘనీయం కదా! శ్రీరామలింగేశ్వరుని ప్రసాదాన్ని మీరాజావారికి అందచెయ్యండి. ఆనాడు దర్శనానికి ప్రస్తావన మనవి చెయ్యండి.

## ద్వితీయ రంగం

దివాన్ సీతారామరాజు:- వీరు వేలపల్లి సోమప్పకవిగారు. సత్యవరం జమీందారుల ఆస్థాన విద్వాంసులు - పండిత కవులు-

సూరకవి:- కవి వరేణ్యులకు నమోవాకములు.

సోమప్పకవి:- దివాన్‌గారూ! వారిని సాక్షాత్ పరిచయం చేసేరుకారు.

సూరకవి:- నన్ను నేనే పరిచయం చేసుకుంటాను. "పుడమిగల రసికులెల్ల బొగడగ విజనరంజన కృతిగావించితినే

'ఔరా సూరకవీంద్రుడ మృదుపద కంఠీరవం కుమ్ముదుమానసుడన్ !"

దివాన్:- ప్రభువుల విజయవిలాసాన్ని సోమప్పకవిగారికి తెలియచెయ్యండి.

సూరకవి:- దానికేం భాగ్యం

పంతమునీకు జెల్లునొకో!

పాటిగను మీరుడు నీవు అత్యమా

పంతము కేల బూనినను!

గొల్వనివాడు ధరిత్రిలోన భూకాంతుడొకండు లేడుకట

కంబు మొదల్కొని గోలకొండ

పర్యంతము నీపెకా విజయ!

రామనరేంద్ర సురేంద్ర వైభవా.

దివాన్:- (పకిలి నవ్వు నవ్వి) పద్యం సూరిసభాయోగ్యంగాను, రాజసభారమ్యంగాను వుండాలి - సంప్రదాయం తెలియాలి - "అంతా కవులమేగామా" అనే ఫక్కీలో ఏదో చెబితే ...

సూరకవి:- దివాన్‌గారూ! ఇది విద్వత్సభ. మీ అభియోగం యేదో విస్పష్టంగా, నిర్దుష్టంగా, వివరించి చెప్పండి, అప్పుడు నా వాదాన్ని పండిత సమ్మతంగా సమర్థిం చుకుంటాను.

దివాన్:- ఏం చెప్పను - మహామండలాధీశ్వరులైన రాజశిఖామణిని, "నీకు" అత్యమా అనిన్నీ, "నీపెకా" అనిన్నీ ఏకవచన ప్రయోగంతో సంబోధించేరు- ఇంతకంటె తూలనాడ ఏముంటుంది.

సూరకవి:- దివాన్‌గారూ! మీకు పరిపాలనా సంబంధమైన పదజాలం తెలిసి వుండవచ్చునేమో కాని కవి సమయం మాత్రం మీకు తెలియదు. అందుచేత నేను చేసిన ప్రయోగం తప్పని భ్రమ పడ్డారు. ఇటు వినండి.

"చిన్నప్పుడు రతికేళిని

సున్నప్పుడు, కవితలోన,యుద్ధములోనన్

వన్నె సుమీ "రా" కొట్టుట

చెన్న గునో భూసపాటి సీతారామా!"

(సభలో హర్ష ధ్వానాలు)

దివాన్:- సరే! దానికేంగాని సోమప్పకవిగారి, కవితనుగురించి మీ అభిప్రాయం?

సూరకవి:- అభిప్రాయానికేముంది?

"దేవు నాననున్న దేశానికొకకవి

యిప్పుడూరమార, నింట నింట

నేసు రార్గుటద్గ రెవమంద్రు తొమ్మండ్రు

చదువుకోని కవులు ధర్మ చరితు"

సోమప్పకవి:- అంత తేలికగా తీసి పారెయ్యకండి - మా పాండిత్యం నాకు తెలియనిదికాదు.

"సోమ కర్దార్థమెఱుంగని కుంభవసుట

వదరెతెవిగాని సూరుని గదనపాలి

రాల దన్నిన సోముని లీలదెలియ

వైతినీ గుట్టు బయలగునసుడు సుకవి"

సూరకవి:- గుట్టు కనిపెట్టడం అంత తేలికా?

"రవి యెరుగును భువి తత్వము

భువిలోపల నుండుజనుల బోషించుసదా

కవుడెరుగు నాట్యతత్వము

కవితా తత్వంబు సూరకవికే తెలియున్"

అని ఏనాడో పెద్దలు చెప్పిన మాటలు, మీ స్మృతి పథం నుండి జారిపోయి వుంటాయి.

దివాన్:- సూరన్నగారూ! కవితా తత్వవేదులుగదా మీరు, పద్యం ఎలా నడవాలంటారు.

సూరకవి:- సరే! వినండి నా కవితా నిర్వచనం-

సీ॥ యతి యుక్తవాక్యానుగతి నంట వలయును, న

త్సంబుదేనువు వెంట దవిలినట్లు

మెట్టుమీదనుగాలు పెట్ట గైదండయుం

దిచ్చినట్టులు ప్రాస మెనయవలయు

సానబట్టిన మణిచందాన బదమర్థ

కారికభంగి బంధంబువలయు

బిబ్బెలుంగు మెఱుంగుదీగె యట్లర్థంబు

లేటతెల్లంబుగా దెలియవలయు

గీ॥ నలతితొలపడ్డ చంద్రమండలముపలన

జలజలనురాలు నమృతంపుజాలు లీల

రసము తులికింపవలెనట్టి రమ్యకవిత

రసిక రసనారి రంపవే ప్రబలునన్న

విజయరామమహారాజు:- కవిగారూ! తెలుగుపద్యం తీయతెన్నులు ముచ్చటగా

వివరించేరు. విజయనగరాన్ని విద్యల నగర మనిపించేరు. అన్నట్టు మీరు త్వరలోనే పెద్దాపురం వెళతారుకదూ! మా శుభా ద్వరులు తిమ్మభూపతికి యీ శ్లోకంతో పాటు నా శుభాకాంక్షలను అందజేయండి. ఖిల్లాదార్ గారు మీ ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు చేసేరు.

సూరకవి:_ చిత్తం.

మూడవ రంగం

రాజాధిరాజా! రాజపరమేశ్వర వత్స వాయి వంశరాకాశశి విజయీభవ! తిమ్మ నృపాలశేఖరా! విజయీభవ! దిగ్విజయీభవ!

తిమ్మభూపతి:_ సభాకల్పతరువుకు సా వందనశతము... నాటి సూరకవి చంద్రాగమనం చకోరానికి శరదాగమనంవంటిది.

సూరకవి:_ విద్వత్ప్రభువుల సందర్శన మాత్రం చేతనే కవిహృదయం పులకరిస్తుంది. మా ప్రభువులు విజయనగరాధినేతలు యీ శ్లోకాన్ని తమకు అందజేయమని ఆదేశించేరు.

తిమ్మభూపతి:_ వారిది మోతీమహల్ కాదు. సరస్వతీమహల్. వారి అభినందన మాకు సర్వదా గౌరవప్రదం. కవిగారూ! శ్రీవారి గంటంనుంచి వెలువడిన ఆ శ్లోకాన్ని మీకంఠంద్వారా వింటేనే యింపుగా వుంటుంది.

సూరకవి:_ అంతకంటె హర్షదాయకమైన కార్యం ఏముంటుంది. చిత్తగించండి.

శ్లో॥ అంభోజం కలయన్ సద్వృత్తమవనే
సాహిత్యరీత్యాం దృశోః
మాంధాతార మహారసంపది మహా
భావేతుకో రాశిషు
శత్రూణాం పురభంజనే ధృతిగుణే
కిం చోరగేంద్రం మతిః
ప్రాగల్భ్య ప్రతిభాతి తిమ్మనృపతిః
సాకాహిత ప్రాభవః

రామసూరి :_ విజయనగరం మహారాజులు విద్యారాజులు. అందుచేతనే వారు గ్రంథరచన చేస్తూ ఇతరులను గ్రంథరచనకు ప్రోత్సహిస్తారు.

సూరకవి:_ కేవలం ముఖస్తుతి అంటే నేను చెప్పలేనుగాని మా ఏలికకు దీటు రాగలవారు లేరేమో అనిపిస్తుంది. ఏమంటారు!

"రాజా కళంకమూర్తి రతి।
రాజా శరీరవిహీనుడంబికా
రాజు దిగంబరుండు మృగరాజు
గృహాంతరసీమవర్తి వి
భ్రాజితపూస పాద్విజయ।
రామనృపాలుండె రాజుగాక యీ
రాజులు రాజులా పెనుక।
రాజులుగాక ధరాతలంబునన్."

రామసూరి:_ అందుకే రవిగాననిచో కవిగాంచునే కదా అన్నారు పెద్దలు. రతిరాజుకంటె తమ ఏలిక యెంత అందమైనవారో కవిగారు రసరమ్యంగా యీ పద్యంలో సూచించేరు.

తిమ్మభూపతి :_ రామసూరిగారూ! కనకాభిషేకానికి సుముహూర్తం ఆసన్నమౌతోంది. సూరకవిగార్ని సభకు పరిచయం చేసి ఆ సువర్ణాసనంపైన వారిని ఆసీనులను చెయ్యండి.

రామసూరి:_ చిత్తం_ నాదొక మనవి. సూరకవిగార్ని పరిచయం చెయ్యడం మధ్యందిన మార్తాండుడ్ని దివిటీతో చూపడం వంటిది.

"గడియకు నూరుపద్యములు గంటములేక
రచింతు దిట్టగా
దొడగితినా శతాలుమని తూలిపడున్,
కులశైలరాజముల్
విడువక నుగ్రహించి నిరుపేద ధనాధిపతుల్యు జేతు, నే
నడిదము వాడ సూరన సమాఖ్యుడ
నాకొకరుండు సాటియే"

అని చెప్పుకున్న సూరకవివర్యులను నేను పరిచయం చెయ్యడం సాహసమే అవుతుంది. ఆయన ప్రవహింపజేసిన సాహితీ ప్రవంతిలోగల వైశిష్ట్యాన్ని స్థాలీపులాక న్యాయంగా మనవి చేస్తాను.

నిత్యవ్యవహారంలో వీరు వాడే కొన్ని ప్రసంగాలుకూడా ఆశుకవిత రూపంలోనే వెలువడుతూ వుంటాయి. శ్రీనాథుని తరువాత చాటుకవితకు యీయననే పేర్కొనవలసివుంది. వీరు కావ్యాలలో ప్రవహింపజేసే కవితాధార ఒకవిధంగా వుంటే, వీరి ఆశుకవిత వేరొకవిధంగా వుంటుంది. అదపాక పెరుగున్న "పాప" అనే పల్లెపడుచుని ఉద్దేశించి వీరు

"అదపాక మామిడాకుల
పొదువుగ నొక విస్తరంట బోడిచినవాడే
ముద మొప్ప విక్రమార్కుడు
అదపాకా అత్తవారు ఔనే పాపా!"

అనే కందాన్ని ఆశువుగా చెప్పేరు. ఈ కవిశేఖరులే కవిజనరంజనంలో అయోధ్యా పురాన్ని వర్ణిస్తూ

"సూపురగము భూపురంధ్రికి
గాపురము జయేందిరకును గగనతల స్పృ
గ్గోపురము భాసిలు నయో
ధ్యాపుర మినవంశ భూధవాధారంబై"

అనే కందాన్ని రచించేరు. కల్పనలోను, శైలిలోను పైరెండు కందాలకుగల వ్యత్యాసాన్ని మీరు గమనించేవుంటారు. అందుచేతనే వీరు నిత్యవ్యవహారంలో వాడుక చేసే ఆశుకవితను ఒక ఫక్కీలోను, కావ్యాలలో పద్యాలను వేరొక శైలిలోను నడిపిస్తారు. ఇది వారి రచనలలోగల విశిష్టత. ఆకాశంమీద మెరుపు మెరుస్తున్నట్లే వీరి పాత్రలు యీయన గంటంకొనలో ఎలా మెరిసిపోతున్నాయో చూడండి.

ధ్వాంతదంతావళో త్కరపుష్కరో
దూత

...ల గంగా పయః కణములనగ
...త్యతాండవ దివ్యహాసమాగతనిర్జ
...రహా క్తిక శ్రేణులనగ
...క పిండజాప్రాదమున నిండార
...న తెలిగల్వ విరులనంగ
...నిశా చంద్రపరిణయంబునకిడు
...క్కుద్యములపిండి చుక్కలనగ
...రిని సొక్కి మొగిసెల్ల దిక్కులందు
...ఘనసార పాటీర తారహార
...ర శారద నారద శారదాభ్ర
...రుచి మీరదారకాకారములుడు"

రాత్రి భోజనానంతరం యీ కవి ...లు చేసేకావ్య పఠనంలోకి విజన ...నంలో గల యిటువంటి పద్యాలను ...న్నో మీరు వింటారు.

వెంకటావధాని - రామసూరిగారూ! ... కవిగారు రచించిన యితర గ్రంథా ...త్తి వ్రాస్తున్నారా?

రామసూరి:- ఈయన మహాపండితుడు. ...త్రాలోకం అనే అలంకార శాస్త్ర ...గ్రంథాన్ని తెలుగు పద్యాలోకం అనే ...లంకార శాస్త్ర గ్రంథాన్ని తెలుగు ...ద్యాలలోకి అనువదించేరు. కవి ...య విచ్ఛేదమనే లక్షణ గ్రంథాన్ని ...పొందించేరు. ఆంధ్ర నామశేషమనే ...ఘంటువు, రామలింగేశ శతకం, బహుళ ...ప్రచారంలో వున్నాయి - సంఘంలోగల ...ాచారాన్ని ధైర్యంగా ఎత్తిచూపి, ...మాజిక స్పృహకలిగించిన రచనరామ ...లింగేశ శతకం, వీరి రామదండకం ... ప్రాంతంలో చాలామంది నిత్యము ...పారాయణచేస్తారు, ఇప్పుడుమంగళధ్వని ...నంతర్య పెద్దాపురం రాజ్యాధి నేతలు ...గా కవి రాజుకు కనకాభిషేకం ...చేస్తారు.

( మంగళధ్వని )

వెంకటావధాని స్వస్తి ప్రజాభ్యః. లోకాస్సమస్తాసుఖినోభవంతు - తేజస్వినావధీతమస్తు - మావిద్విషావహై

ఓంశాంతిః శాంతిః శాంతిః

రామసూరి ఇప్పుడు కవిగారి ప్రతివచనం మనం విందాం.

సూరకవి కవిత, లత వనిత, అలంబన లేనిదే వికసించవుకదా. తత్రాపి, కవిత, లలితకళ. అందుచేత కావ్యశిల్పం ఎంతరమ్యంగావుంటే కవిత, అంతరాణిస్తుంది. అందుచేతనే, "ఉభయకావ్యప్రౌఢిపాటించు శిల్పము నంజారగుడ, కళావిదుడవని తిక్కన చెప్పుకున్నాడు - ఆ శిల్పం విశ్వశ్రేయస్సును కాంక్షించే కావ్యంలో ప్రతిబింబించాలి. అప్పుడే కవికి ఘనత కావ్యానికి శాశ్వతత్వం చేకూరుతాయి. ఆనందం కావ్య ప్రయోజనమేకావచ్చును. కాదనను - జీవితాన్ని ఉద్దీపింపజేసేమార్గాన్ని ఆనందోత్సాహంతో కాంతాసమ్మితంగా కావ్యం నిరూపించాలి. పశుప్రవృత్తి నుంచి దైవప్రవృత్తికి జీవితాన్నిమళ్ళించేదే ఉత్తమ కావ్యం. సర్వకాలాల వారికీ, సర్వదేశాల వారికి ఆకర్షణీయంగా మహాకావ్యం ధ్వన్యాత్మకంగా ఒక మహత్తర సందేశాన్ని అందించాలి. కవిజనరంజనంలో ఒక ఉత్తమ పాలకుడ్ని చిత్రించేను. యథారాజా తథాప్రజా - ఈ కనకాభిషేకానికి అభిషేక ప్రియుడైన రామలింగేశ్వరుడే అర్హుడు - ఆ పరాత్పరుని ప్రతినిధిగా మాత్రమే వ్యవహరించేను.

స్వస్తి.

వెంకటావధాని - ఇప్పుడు శ్రీరామసూరిగారు కవిగారికి అభినందన పద్యసుమాన్ని అందజేస్తారు.

"ఆధునికుల్ కవీంద్రులు సహస్రసముల్లుం
దురుగాక నీవలెన్
మాధురిగల్గునే, కవన మార్గము తిక్కన
సోమయాజి శ్రీ
నాథుడు ముక్కుతిమ్మకవినాడు ప్రసి
ద్ధులుగా కిటీవలన్
గాధితమయ్యె నీవలన గాదకవిత్వము
సూరసత్కవీ

సూరకవి - ధన్యోస్మి -

వెంకటావధాని - ఏమిటీ చిత్రం! అలా విడిచిపెట్టి ఆయనవెళ్లి పోతున్నారే.,

ఎవరూ పట్టించుకోరేం చెప్మా! ఈ కనకాభిషేకం చేసిన సువర్ణం యిక్కడే పడివుంది - ఏందారి! ఏమయ్యోయ్ సూరకవిగారు మిమ్మలే! పలకకుండా వెళ్ళిపోతున్నారే! ఎవరికీ బాధ్యత లేదు.

రామసూరి - ఏమిటీ గాథరా!

వెంకటావధానులు - గాథరా అని మెల్లిగా అంటారేం? అభిషేకం చేసిన సువర్ణనాణేల్ని నేలమీద విడిచిపెట్టిమరుదుకు సాగిపోతున్నారు సూరకవిగారూ! ఒక్కక్షణం ఆగాలి - నాణేల్ని భద్రపరచి మీకు అందజేస్తాం -

సూరకవి -

క్షమించండి అవధానిగారు - స్నానం చేసినది పానంచేసే అభ్యాసం నాకులేదు.

స్వస్తి

—0—

# 4. సుప్రసన్నగారి 'స్తుతిప్రబంధము'

—శ్రీ పాతూరి రఘురామయ్య

సుప్రసన్న ప్రసన్న కవితా రచనలో ఆరితేరిన ఆధునిక కవి. వీరి ఋతంభర, శతాంకుర, శ్రీ పాంచాలరాయ శతకము, అభువా, పాండిచ్చేరిగీతాలు, శేఫాలికా, దుఃఖయోగిని కావ్యాలు. తెలుగులోకము నలరించుచున్నవి. హృద్గీత ఆనందలహరి అను రెండు కావ్యములను శ్రీ సంపత్కుమారాచార్యులతో కలిసి రచించినారు. ఇప్పుడు స్తుతి ప్రబంధమును వెలయించినారు.

21-12-1988 నాడు, సుప్రసన్నగారి గురుదేవులైన శ్రీమాన్ కందుకూరి శివానందమూర్తిగారి అరవైఏళ్ళ జయంతిలో భావ-భక్తిపూర్వకంగా అంకిత మిచ్చినట్టి కావ్యమిది. గురుదేవులకిది ఉపహారము. ఆంధ్ర భారతికి మరొక మణిహారము.

'స్తవ్యః స్తవప్రియః స్తోత్రం
స్తుతః స్తోతా రణప్రియః'

అన్న అర్థవాక్యం ఈ ప్రబంధమునకు ప్రేరణాత్మకమైనట్టిది. ఈ ప్రబంధమున అగ్నిసూక్తము, దేవీపూజ, శ్రీ లక్ష్మీనృసింహోదాహరణము, శ్రీనృసింహప్రపత్తి, గణపతి స్తుతి, కృపారేఖ అను భాగములు ప్రార్థనాయుత కీర్తనాత్మకములుగా నున్నవి. శ్రీ లక్ష్మీనరసింహోదాహరణము 1980లో, దేవీపూజ 1982-83లలో రచింపబడినవి. ఆకాలమున అవి భారతి, సాధన మొదలగు పత్రికలలో వచ్చినవి. శ్రీనరసింహప్రపత్తి, గణపతిస్తుతి, కృపారేఖ-ఈమూడు రచనలు ఇటీవలనే రచింపబడినవి. అగ్నిసూక్తము ఇక్కడి మాత్రము 1988లో రచింపబడినది.

ఆయుజాతవేదా సరో-
దయమహేతు, ప్రతిలోకమైత్యధారామూర్తి
నియదుపేక్మలక, యజ్ఞ
ప్రియాః తమమ్మ నగతేయవే యీ
నృష్టిన్.

ఇది అగ్నిసూక్తమున మొదటిపద్యము. ఇందు కవియొక్క రచనాపాటవమనికాక, ఒక భక్తునియొక్క విశిష్టమైన ధ్యానధారను పేర్కొనవలసి ఉంటుంది. కవియైన భక్తుని స్తుత్యాత్మక ఘోషమిందు అనాహత భావ తరంగములను స్ఫురింపించుచున్నది. కంద రచనా పాటవము కూడా ప్రశంసనీయమే.

యజ్ఞో వైవిష్ణురితి
ప్రజ్ఞాపారమ్య భావపరిణతి చేతో
విజ్ఞేయసంగమ పరిష్టుయాత్రాయతమై.

కరుణాసాగరము పొంగిపొరలుటకై, తాపము లణచుటకై, అఘములు కాల్చుటకొరకై, అంకితభావమున కృంతనము నొసరించుటకై కవి అగ్నిదేవుని కీర్తించుచు ప్రార్థించుచు వ్రాసిన కందములు ప్రకృష్టబంధములై ఆత్మగతములై నూతన వెలుగుల చేకూర్చుచున్నవి.

దేవీపూజయందలి శ్రీ దేవీ మాహాత్మ్యము గురించి ఆమె దివ్యలీలా విలాసాలను కీర్తించుచున్న చిత్రసమ్మోహక ఆత్మప్రియంగమ గీతములై యున్నవి.

శ్రీరామచంద్రుని చిత్తవీథిన్ వెల
ఆమెపాలుకు ప్రాభాతాక్షరేఖ
మైథిలీదేవి కోమల కృపాకాంతము లట్టు
ఆమె పాదములు సంధ్యారుణములు
ఆమె చూపులు నిగమాద్య ధర్మోద్ధార
నామహావాక్య విన్యాసకములు
ఆమె కన్నులు నిగమాంత తత్త్వజ్ఞాన
రమ్య ప్రవాహిత లక్ష్యములు
అంతె, ఆమె మోహనాకారమును చూచి
మనసులోన కోర్కె మసలరాదు
ఒక మహానుభవము ఉద్దీప్తమైనచో
కోర్కెలెల్ల మనసుకొనల జారు.

ఇట్టి దివ్యానంద భావనావిన్యాసం ఆధ్యాత్మిక లోకాలను స్పృశిస్తుంది.

శ్రీలక్ష్మీనరసింహోదాహరణమున యాదగిరీంద్రుని ప్రథమదళమున 'కొమ్మాలస్థితుని' ద్వితీయదళమున, కొరుటూరిపంచలోన నెలకొన్న స్వామిని (నృసింహాద్రి) తృతీయదళమున వేల్పుగొండ నృసింహస్వామిని చతుర్థదళమున, వేదగిరీంద్రమున వెల్గు నృసింహస్వామిని పంచమదళమున, శ్రీ అహోబిల నృసింహగిరి నృసింహుని సప్తమదళమున, మంగళగిరి స్వామిని అష్టమదళమున (సంబోధనావిభక్తితో) స్వర్గం కన్నా మహితమైన ఆనందప్రదముగ ప్రబంధరచన గావించినారు.

ప్రతిభావమును శ్రీ మధుకోహలం చిందిన వెన్నెల'తో నింపి భవ్యముగా దివ్యముగా రచనసాగించిన స్తుతులను రచించిన కవి సుప్రసన్న, నృసింహప్రపత్తి మొదలగు ఇతరములైన స్తుతులు కూడ. సుప్రసన్న ధ్యానధారవలన ఆకృతినొందిన మధురభావములు, తేజోరేఖలు, అమృతభాండములు. ఈ పుస్తకము వెల : నాలుగు రూపాయలు మాత్రమే.

కాపీలకు :

కోవెల శ్రీనివాస్
శ్రీ వాణీ ప్రచురణలు
9-1-189, గిర్మాజీపేట
వరంగల్లు — 506 002

అన్న చిరునామాకు వ్రాసి పొందవచ్చును.

—0—

"సుమభావన"

# 5. దాశరథి కావ్యసమీక్షా శరధి (గ్రంథ సమీక్ష)

—శ్రీమతి పి. శాంతమ్మ. ఎం.ఏ.,ఎం.యిడి..

కవి రాస్తాడు. విమర్శకుడు వివరిస్తాడు, విమర్శకుడు కవి మనసులో ప్రవేశించి తాదాత్మ్యం చెంది, అతని భావాల్ని వరించి, 'విరించియై' ఆ కవితకు ఓ నూతనస్థానాన్ని సృష్టిస్తాడు.

అలనాటి దాశరథి కట్టిన వారధి కథలలో మాత్రమే మిగిలింది. కాని నేటి దాశరథి కట్టిన అభ్యుదయ కవితా వారధిని పాఠకుల కన్నులకు దర్శింప చేయడానికి, మనసులను రంజింప చేయడానికి పూనుకొని పఠితులను ఆలోచనా రథము మీద కూర్చుండజేసి తాను సారథియైనవారు ఆచార్య భావనలు.

విజయనగరంలో విజయభావనా వీచికలను ప్రసారింపజేసిన శ్రీ ఆచార్య భావనలు దాశరథి కురిపించిన 'అగ్నిధార' ను వివరించారు మొదట. ఆనాటి తెలంగాణా ప్రజల దుర్భర జీవితాన్ని, హింసాచర్యలను తాను చూసి, మనకు చూపించారు. దాశరథిలో విప్లవకవి పూపిరిపోసుకున్న సంఘటనలు వివరించారు. దాశరథిలోని శృంగార కవిత్వాన్ని అలావుంచి అంగార కవిత్వాన్నే సమీక్షించ బూనడం ఆచార్యభావనుల మనము సద్భావనాయుతము। సమయభావనామయము॥, శ్రేయోభావనాలయము॥ అని సుస్పష్టము।

ఈ సమీక్ష శరధి-చదువుతున్నట్లుకాకుండా ఆత్మీయులతో మాట్లాడినట్లుంటుంది. అతి సరళమైన మాటలతో అలా అలా గంగా ప్రవాహంలా సాగుతూ చక్కని వాక్యాల చల్లని గాలులు వీస్తూ కమ్మని భావనల సువాసనలు గుభాళిస్తూ పఠితలను అమృతాభిషేకం చేస్తుంది.

యుగకవి జాషువాను పుక్కిట బట్టిన ఆచార్యభావనుల కలం దాశరథి 'అగ్నిధార' ను సమీక్షించి 'ప్రవంతి' వైపుమళ్ళించింది. ఆ ఉత్సాహంతోనే రుద్రవీణ' తీగలు మీటి దాశరథిగానంలోని రాగాన్ని వివరించింది; 'తిమిరంలో సమరం' ప్రారంభించి, జయించి, పఠితలకు 'మహాంధ్రోదయం' దర్శింప జేసింది. ఆచార్య భావనుల మనోలోచనాలకు దాశరథి 'ఆలోచనాలోచనాల'ను తరిచిచూడాలని పించింది, సంకల్పమే 'సమాలోచన' మైంది. తెలుగువిద్యార్థికి వివరించింది. కవిసృష్టించిన 'కవితా పుష్పకాన్ని' 'నవభారతి'కి సవినయంగా అందించింది.

'దాశరథి కోరిన అభ్యుదయ మార్గంలో పయనించడం మనందరి కర్తవ్యం' అని 'నవభారతాన్ని' ప్రబోధిస్తున్నారు. శ్రీభావన్.

దాశరథిలోని విరాట్ స్వరూపాన్ని గుర్తించి వారిని శబ్ద బ్రహ్మారాధకునిగా భావించారు. శ్రీ భావన్. 'సత్యము, మితము, ఉచితము అయిన శబ్దప్రయోగమే దాశరథిని శబ్దబ్రహ్మారాధకునిగాచేసింద'ంటారు' అంతే కాదు, అసత్యం, అనవసర వాగ్వ్యయము, అనుచిత పొగడ్తల యుగ్దలు శబ్దబ్రహ్మను దారముగా ధృవపరిచారు అమృతాభిషేక సమీక్షలో శ్రీ భావన్. కవికి 'ఆత్మవిశ్వాసమేగాక ఆత్మాభిమానం, అధికారం చెలాయించే దర్పం కూడా వుండాలి' అంటారు ఓచోట.

అభ్యుదయకవి దాశరథిని తొలిగా చదివే ప్రయత్నంలో 'మహాబోధి'ని చేరుకున్నారు: 'భాషమీద ప్రభుత్వమూ, భావంలో వైశాల్యమూ కవిత్వంలో ప్రవాహమూ గల కవి దాశరథి అని వీరికి జ్ఞానోదయమైంది. ఆ విజ్ఞానామృతాన్ని భాగ్యనగరపు 'నవభారతి' ద్వారా నవభారతాని కందించారు శ్రీభావన్.

దాశరథి రచించిన 'అమృతవల్లి తెలుగుతల్లి' రూపాన్ని 'సమాలోచనా'ద్వారం నుండి మన కన్నులకు సాక్షాత్కరింప జేసారు రచయిత.

వీరి నిరాడంబర వ్యక్తిత్వమూ, బుద్ధిశక్తియూవీరి పదాల్లోను, వాక్యాల్లోను సుస్పష్టము. అహోరాత్రులు సాహితీక్షేత్రంలో శ్రమించి అనేక ప్రయోగాలు చేసి మధుర కవితాఫలాఫలాను పాఠకులకు అందిస్తున్న కృషీవలులు శ్రీ భావన్.

జాషువాను ధించిన ఈరచయితకో దాశరథిలోని వేదనను అర్థం చేసుకొని అతని కవిత్వంపై 'ధ్వజమెత్తిన ప్రజ'యై జీవన ప్రపంతిలో జీవించారు. తాను దాశరథి కవితా శరధిలో మునకలువేస్తూ నవకవితాప్రియులను ఆహ్వానిస్తున్నారు-ఆణి ముత్యాల్లాంటి సందేశాలను సంగ్రహించుకోమని అభ్యర్థిస్తున్నారు:

'కవిత్వానికి ప్రధానమైంది భావావేశం ఇది చేతక్తి కవిత్వానికి ప్రధాన లక్షణం' అంటారు శ్రీభావన్. దాశరథి గళాన్ని భావన్ కలంలా ఇంకెవరూ అర్థంజేసుకోలేరని గట్టిగా చెప్పడానికి కొన్ని వాక్యాలు చూడండి:

"విశ్వవ్యాప్తమయిన శాంతిస్థాపన దాశరథి ధ్యేయం"

ఆయనకున్నది ఒకటే ఆయుధం - అది కవిత ఆ ఆయుధంతోనే ఈ జగత్తు నంతా గెలిచి వీ విహారం చేయగల యోధుడు."

అచ్చంగా 'సొంత అనుభవాలు, ఇతరుల అనుభవాలు. వ్యక్తికీ సంఘానికీ గల చుట్టరికం, ప్రకృతికీ మనకు గల పారస్పరిక బాంధవ్యం, నవసృష్టికోసం కృషి ఈ అయిదు దాశరథి కవితా సౌధరచనకు వాస్తుశాస్త్రంలా తోడ్పడ్డాయి.

'లోకమంతా శాంతి పథంలో నడవాలని దాశరథి శుభాకాంక్ష'

'తనకు కావలసిన ఆ జ్యోతిర్మయవాలను వెదకటం కోసం లక్షదీపాంకులనైనా దాటి వెళ్ళ గల దీక్షను ప్రకటించాడు."

"సాటి మనిషిని బ్రతికించు కోలేని దమ్ము బ్రతుకుపై దాశరథికి ఎంతో విరక్తి."

'...... బాంబులతో సాధించడంకాదు. విప్లవాన్ని హృదయాల్లో సాధించాలి. ఇదీ దాశరథి విప్లవతత్వం".

కేరటాన్ని ఆదర్శంగావించి కవిగా విశ్వ విపంచిని మీటి, పరిశోధకునిగా జాషువాను తరచి అనేక సారస్వత పత్రికలను తోడిపోసి పండితారాధ్య పరిమళాన్ని గుబాళింపజేసి, గురుబ్రహ్మగా అనేకమందిచే కవితాభ్యాసం చేయించి, అక్షయమైన 'అక్షర లక్షల' అందించిన శ్రీ ఆచార్య భావన్ కృషి వర్ణనాతీతం. దాశరథి వ్యక్తిగా శిష్టుడు. కవిగా విశిష్టుడు. శ్రీ భావన్, వ్యక్తిగాను, రచయితగానూ, విమర్శకుని గానూ విశిష్టులే.

శ్రీభావన్ దృష్టిలో దాశరథి సుకుమార హృదయుడు, కరుణామయుడు, నూటికి నూటపాళ్ళు ఆశావాది. ఆశే ఆయన కవితకు పునాది. ఆస్తికత్వాన్ని గూర్చిన కవితలో దాశరథి భావాన్ని చక్కగా విశ్లేషించింది భావన్ కలం.

'దాశరథి కవితలో ఉత్పత్తి. భావనాబలం, శిల్పం అనే మూడులక్షణాలు ముప్పేటలుగా పెనవేసుకున్నాయి.'



## ఆర్. టి. సి. కన్నీరు

అమ్మకు ఒక్కరోజు సుస్తీచేస్తే
పొయ్యిలో పిల్లిని లేవకపోతే
పొట్టలో ఎలుకలు పరుగెడతాయి
ఆకలికేకలు వినబడతాయి
ఆర్. టి. సి. బస్సులు ఒక్కపూట
తిరగకపోతే
ఆగిపోతుంది నగరజీవితం
నిలిచిపోతారు ప్రయాణీకులు
నిర్మానుష్యమౌతాయి వీధులు
అయినా మనం కృతఘ్నులం
అమ్మనే బాధించే పిల్లలం
ఆగకుండాతిరిగే ఆర్.టి.సి. చక్రాల్ని
పంచరు చేసే వంచకులం
'రస్తారోఖో'తో ఆపేస్తాం
రాళ్ళ దెబ్బలతో హింసిస్తాం
'సమ్మె'అపోట్లతో చంపేస్తాం
ఆందోళనలతో ఆహుతిచేస్తాం
అత్తమీదికోపం దుత్తమీద
అందరికోసం ఆర్. టి. సి. మీద
ఎల్లవేళలా ఎక్కితిరిగే బస్సులనే
ఏరుదాటి తెప్పతగలేస్తున్నాం

---

'దాశరథికి స్థలాన్ని ఆక్రమించడం మీద నమ్మకం లేదు. కాలాన్ని ఆక్రమించడం లోనే ఆశ.'

'దాశరథి—తెలంగాణాలోని కోటి వీరుల గళధ్వని మాత్రమేకాదు. ఇలాగోళమందుండెడి ఎల్లరి శబ్దం,' అని శ్రీభావన్ వ్యక్తం చేశారు.

ఆస్థానకవి దాశరథి సృష్టించిన కవితాశరధిలో మునిగి, ఆణిముత్యాలను అందుకో గల్గిన సహృదయాస్థానకవి ఆచార్యభావన్ అనటానికి పైమాటలు చాలవనుకుంటే మీరు కూడా ఈ కవితాశరధిలో ఒకసారి మునిగి తేలండి. ఆలస్యం ఎందుకూ? ... ...

...—...

## సిటీబస్సు

కులం మతం వర్ణం వర్గం
లింగభేదం కూడా మరిచి
పాపం పుణ్యం కోపం తాపం
సిగ్గు ఎగ్గు కూడా విడిచి
అంతా కొద్దిసేపైనాసరే
రాసుకుని పూసుకుని
త్రోసుకుని తిరగడానికి
నగర జీవనం ప్రసాదించిన వరం
సిటీబస్సు



## దేవదానవులు

ఒకడు
సాటిమానవునికి
మూత్రపిండం దానంచేసి
మృత్యువాతనుండి కాపాడితే
మరొకడు
స్వార్థంకోసం
పిల్లల్ని ఎత్తుకొచ్చి
కాళ్ళుచేతులు విరిచి
కళ్ళు పెరికి భిక్షమెత్తించి
పొట్టపోసుకుంటున్నాడు
ఈఇద్దరూ మనుష్యులే
వీళ్ళే దేవదానవులు



## అధికారం

అధికారం
ఘాటైనకారం
అదిమోతాదు మించితే
భరించలేము ఎవరం

—శ్రీ వేముల ప్రభాకర్ గౌడ్



# చలం సాహితీ సంచలనం

విజయనగరం:–

స్థానిక అయ్యకోనేరు – తూర్పుగట్టులోని శ్రీ బులుసు – జి. ప్రకాష్ ఇంట్లో విజయభావన 31-5-90 గురువారం నాడు "చలంసాహితీ సంచలనం"పై సభను ఏర్పాటు చేసింది.

విజయనగరం – మహారాజ మహిళా కళాశాల హిందీశాఖాధ్యక్షులు డా॥ఎస్. విజయలక్ష్మికుమారి సభకు అధ్యక్షత వహించారు. అభ్యుదయ రచయిత, అరాచకవాది అయిన చలంలో చిత్తశుద్ధి, నిజాయితీ నిర్భీతి వున్నాయని డా॥ విజయలక్ష్మికుమారి అన్నారు. సంఘంలోవున్న "చెడ్డ"కి కూడా చికిత్స చేస్తే అదికూడా వుపయోగపడుతుందని చలం అభిప్రాయపడినట్లు ఆమె చెప్పారు. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం, శాంతియుత జీవనం కావాలంటే "స్వేచ్ఛ" అవసరమనీ, ఆస్వేచ్ఛను సాధించటంలో చలం సాహిత్యం విప్లవ శంఖారావంగా సంచలనం రేపిందని డా॥ విజయలక్ష్మి కుమారి వివరించారు. చలం రచనల్లోని ప్రేరణ, ఆశయం, శిల్పం అనే మూడు అంశాలను గురించి ఆమె విపులంగా చర్చించారు.

విజయనగరం – మహారాజ గరల్స్ హైస్కూల్ కి చెందిన టీచర్ మరియు విజయ భావన సహాయకార్యదర్శి అయిన కుమారి నడిమింటి విజయలక్ష్మి ప్రధాన వక్తగా పాల్గొని చలం సాహితీ సంచలనం గురించి ప్రసంగించారు. చలంరచనలైన స్త్రీ, మ్యూజింగ్స్, ప్రేమలేఖలు, బ్రాహ్మణీకం, అమీనా, జీవితాదర్శనం అనే వాటిని గురించికుమారి విజయలక్ష్మి ప్రధానంగా చర్చించారు. ప్రకృతి విశ్లేషణ చేయటం ద్వారా చలం అనంత భావుకుడుగా, వేదాంతిగా సభకు గోచరిస్తాడని ఆమె అన్నారు. భావసంచలన కారుడైన చలం నిరంతర సత్యాన్వేషి, విశాల హృదయుడు అని కుమారి విజయలక్ష్మి వివరించారు. అయనది సహజ సిద్ధమైన శైలి కనుకనే ఆయన రచనలపట్ల మనం ఆకర్షింపబడు తున్నామని ఆమెఅభిప్రాయపడ్డారు. చలం నమ్మింది వ్రాసి. వ్రాసింది ఆచరించిన ఘనుడని ఆమె కీర్తించారు.

"బ్రాహ్మణీకం" నవల్లో మత ఛాందసుల ఇంట్లో పుట్టిన సుందరమ్మ పాత్రని తీర్చిదిద్దటంలో చలం కనుబరిచిన విలక్షణతని గూర్చి ఆమె వివరించారు. కథలని నవ్యనికాంతి విగ్రహాంగా ఆమెని చలం వర్ణించినట్లు చెప్తూ, ఆమెకున్న భూతదయవల్ల అన్నీ పోగొట్టుకుందనీ, అయినా ఔన్నత్యాన్ని నిలుపుకోగలిగిందనీ చలం చిత్రించినట్లు కుమారి విజయలక్ష్మి చెప్పారు. "అమీనా" నవల్లోని నాయిక అమీనా తనకిష్టమైనట్లు నడుచుకోవటమే ధ్యేయంగా కలిగిన ధైర్యశాలిగా ఆమె అభివర్ణించారు.

చలం ప్రేమలేఖలు – టాగోర్ గీతాంజలి వంటివని కుమారి విజయలక్ష్మి చెపుతూ, ఈ ప్రపంచమే సృష్టి సౌందర్యంతో కూడిన ఒక పెద్ద ప్రేమలేఖ అని చలం సంభావించాడని ఆమె తెలియజేసారు.

వందూరి సుబ్బారావుతో చలానికిగల పరిచయాన్ని వివరిస్తూ, ఆయన ఎంకి పాటల్ని మెచ్చుకునే వాడని ఆమె అన్నారు.

కవిత్వాన్ని [illegible] విశిష్టమైన వ్యక్తిగా "పోతన" అంటే చలానికి [illegible] చెప్పారు. స్త్రీ అభిమానవతిగా వుండాలన్నది [illegible] ప్రాయమని ఆమె అన్నారు. స్త్రీల స్వభావాలను ఎరిగి, కళాత్మకంగా విశ్లేషించిన ఘనత చలం [illegible] అవటానికి కారణమని ఆమె అభిప్రాయపడ్డారు. స్త్రీ మేధావుల్ని కేవలం సంసారానికి పరిమితం చేయటం చలం దృష్టిలో "సాంఘిక నష్టం" అని ఆమె వివరించారు.

నేటివిద్యావిధానాన్ని, వివాహ వ్యవస్థని చలం సంస్కరించ దలచాడు కానీ ఖండించలేదని ఆమె అభిప్రాయపడ్డారు. చెడ్డపేరు వస్తుందేమోనన్న భయంతో 'మార్పు'ను నిరోధించకూడదని చలం సందేశమిచ్చినట్లు కుమారి విజయలక్ష్మి చెప్పారు. చలం రచనల్లో ప్రాచ్య-పాశ్చాత్య సమన్వయ ధోరణి కనపడుతుందని కుమారి విజయలక్ష్మి చెపుతూ తన ప్రసంగాన్ని ముగించారు.

విజయనగర – మహారాజ గరల్స్ హైస్కూల్ మ్యూజిక్ టీచర్ శ్రీమతి డి. విజయలక్ష్మి ప్రధానవక్త కుమారి విజయలక్ష్మిని శాలువా, పూలమాల, మెమెంటోలతో ఘనంగా సన్మానించారు. వేదికపై పాల్గొన్న సాహితీ వేత్తలందరికీ ఆమె సంస్థ తరపున మెమెంటోలను బహూకరించారు.

సంస్థ ప్రధాన కార్యదర్శి డా॥ ఎ. గోపాలరావు స్వాగతం చెప్పారు. సంస్థ అధ్యక్షుడు డా॥ఆచార్య భావన్ ప్రార్థన గావించి, సందేశపఠనం చేసారు. విజయ భావన గౌరవ సభ్యులు శ్రీ బులుసు జి. ప్రకాష్ వందన సమర్పణ చేసారు.

—శ్రీ ఆచార్య భావన్

0—0

# నన్నయభట్టారకుని భారత సూక్తిరత్నములు

సంకలనం:
కీ॥ శే॥ విద్వాన్
బులుసు సీతారామశాస్త్రి

తగునిది తగదని యెదలో
వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్.
ఆది 1-86

తా॥ ఇది తగినదని ఇది తగనిదని యని మనసులో ఆలోచింపక సాధువులకు, పేదలకు హానిచేయు దుష్టప్రవర్తనులకు అకారణములైన ఆపదలు సంభవించును.

నిండు మనంబు నవ్య నవ
 నీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జ
 గన్నుత విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విప
 రీతము గావున విప్రుఁ డోపు నో
పం డతి శాంతుఁ డయ్యు నర
 పాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.
ఆది 1-101

తా॥ జగత్తుచే నుతింపఁబడిన ఓ మహారాజా! బ్రాహ్మణుల నిండుమనస్సు అప్పుడే తీసిన వెన్నతో సమానము (మృదువైనది). వారి పలుకు క్రూరమైన దేవేంద్రుని వజ్రాయుధముతో సమానము (అతి కఠినమైనది). ఈ రెండు విషయములును రాజులయందు విరుద్ధముగా నుండును. ([illegible]) కావున బ్రాహ్మణుడు శాపమును మరల్పఁగలఁడు కాని, మిక్కిలి శాంతము వహించినప్పటికిని రాజు తన శాపమును మరలింపఁ జాలఁడు.

తన యెఱిఁగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు చెప్పు మని
 యడిగినఁ జె
ప్పని వాఁడును సత్యము సె
ప్పనివాఁడును ఘోరనరక పంకమునఁ
 బడున్.
ఆది 1-187

తా॥ ఓ పుణ్యాత్ముడా! ఇది యెట్లని యడిగినపుడు తనకుఁ దెలిసిన విషయముఁ జెప్పనివాఁడును, నిజము చెప్పనివాఁడును ఘోరమైన నరకమనెడి బురదయందు మునుఁగును.

భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు
 పుట్టుచుఁ దోడనపుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహిత
 సంహిత బుద్ధియుఁ జిత్తశాంతియున్
మాన మద ప్రహాణము స
 మత్వము సంతత వేదవిద్యసా
స్థానము సత్యవాక్యము దృ
 ఢ వ్రతముం [illegible]త్వమున్.
ఆది 1-158

తా॥ భూమియందుఁ బ్రశంసింపఁబడిన కీర్తిగల ఓ మునివరా! బ్రాహ్మణునకు పుట్టినతోడనే ఉత్తమమైన జ్ఞానము కలుగును. సమస్త ప్రాణులకు మేలుచేయు బుద్ధియుఁ గల్గును. మనశ్శాంతి, గర్వాతిశయము లేకుండుట, సమభావము, ఎడతెగని వేదవిధుల ఆచరణము, సత్యము పలుకుట, గట్టిదీక్ష, మిక్కిలి [illegible] భావము వానివెంటనే జనించును.

తగియెడు పుత్త్రులం బడసి
 ధర్మువు దప్పక తమ్ము నుత్తముల్
పొగడఁగ పుణ్యహోమతులు
 బొందు గతుల్ గడు ఘోరనిష్ఠతోఁ
దగిలి తపంబు సేసియును
 దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్
వెగడుగఁ జేసియుం బడయ
 నేర రపుత్త్రకులైన దుర్మతుల్.
ఆది 2-50

తా॥ ఉత్తములైన పుత్త్రులను గని ధర్మము తప్పక, ఉత్తములచే నుతింపఁబడు మహాత్ములు ఉత్తమగతుల నొందుదురు. మిక్కిలి ఘోరమైన నిష్ఠతో [illegible] తపము చేసినను, తృప్తికరముగా దక్షిణ లిచ్చి యజ్ఞములు చేసినను అపుత్త్రకులైన దుర్మతులు ఉత్తమగతులు [illegible].

(స. శే. శా.)